# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక




మార్చి 1995

# ఉత్తర భారత యాత్రలు

| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 1,300 |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 400 |
| 3 | Delhi-Mussoorie Haridwar-Rishikesh-Delhi | Every Friday | 350 |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 2,200 |

Fare includes Dormitary accommodation and transport/Guide charges Tariff for Tour No 4, is inclusive of food also enroute, except at Delhi We are running LTC tours for Central Government employees in collaboration with ITDC All tours are by Super Deluxe buses, starting from our New Delhi office Contact our offices for advance reservations

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్" లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిసెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

## Southern Travels/Hotel Southern

ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ

**18/2, Arya Samaj Road, WEA Karolbagh, New Delhi - 110 005.**

(Phones : 5722210 (6 Lines); 5739508)

**Our branches**

1 Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004 (Phones 223658, 227233)
2 Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones 2267040; 2262633)
3 Hotel Howrah Complex, Opp Madras Central Railway Station, Madras - 600 003 (Phones 564864, 585253)
4 No 10, Swarnalok Complex, Opp Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones 62227)
5 Pavan Palace, Ground Floor, Opp T S.R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016. (Phone 545565)

శ్రీమత్ **ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం**

రిజిష్టర్డు నెం. 195/88

2–2–21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6–3–609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

# నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19–5–1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/–లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచె నమెట సుబ్బరాయుడు — హా నరసింహులు

ప్రధాన కార్యదర్శి

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య
# నిత్య అన్నపూర్ణ సత్రం


హెడ్ ఆఫీసు : కంభం స్థాపితం : 1961 బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 2262 ప్రకాశం జిల్లా. ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.


అతి పవిత్రమైన జ్యోతిర్ లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన,వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18x15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12x10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్థోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

యిట్లు

పాలకవర్గం

అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969

సంపుటి
26

సంచిక
7

మార్చి-1995

సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి

ప్రాప్తిస్థానం
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.

సంపాదకీయం

# చిత్ర నిర్మాతలకు తగని పని

హాస్య రస పోషణ కంటూ ఒక కులాన్ని ప్రత్యేకించి చూపడం ఈ మధ్య చాలా మందికి అలవాటైంది.

సమాజంలో ఒక బాధ్యతను తనకై తానే తలకెత్తుకున్న వాడైన రచయుత కూడ ఇందులో భాగస్వామి కావడం మరీ విడ్డూరం.

హాస్య రస పోషణ పేరుతో సభ్య సమాజం హర్షించని పద్ధతులను పాటిస్తున్న ఇట్టి వారిని సంస్కారహీనులనో, కుసంస్కారులనో అనాలో! లేక ఇంత కన్నా నీచమైన పదాలు మన ఆంధ్ర భాషలో ఏమైనా ఉన్నాయో ప్రత్యేకంగా పరిశోధించి, ప్రయోగించాలో? మరి.

ఏది ఏమైనా తమ లక్ష్య సాధనకు ఒక కులాన్ని వ్రేలెత్తి చూపించడము మాత్రము క్షమార్హమైన నేరము కాదు.

"చింతామణి" "కన్యాశుల్కం" వంటి కొన్ని నాటకాలలో వైశ్యుని పాత్రను తమ హాస్యరస పోషణకు ఆలంబనంగా తీసుకోవడమూ; దాన్ని ఆంధ్రదేశములోని, రాష్ట్ర, జిల్లా, కడకు పట్టణ స్థాయి వైశ్య సంఘాలు కూడ తమ వ్యతిరేకతను గట్టిగా చెప్పడమూ అనేక సార్లుగా జరుగుతూనే ఉంది.

వైశ్యులను నీచంగా చిత్రిస్తూ, వారిని దేశభక్తి లేని వారుగా, సమ సమాజ నిర్మాణానికి చాలా

దూరంగా ఉన్న వారుగా చూపుతూ ఆకాశవాణిలో ప్రసారమైన కొన్ని నాటికలు, నాటకాలు కూడ లేకపోలేదు. ఆయా విషయాలను గమనించి, రాష్ట్రములోని వైశ్య సంస్థలు ఆకాశవాణి దృష్టికి తీసుక పోవడమూ, అందుకు ఆకాశవాణి వారు కూడ - గొప్ప మనస్సుతో తమ విచారాన్ని ప్రకటించి, ఇక ముందు అటువంటివి జరుగకుండా తగిన చర్యలు తీసుకొంటామని హామీలు ఇచ్చిన సందర్భాలు గూడ ఉన్నాయి.

చింతామణి నాటకాన్ని చలన చిత్రంగా రూపొందించే ప్రయత్నం చేసిన చలన చిత్ర నటులు శ్రీ పద్మనాభము, ప్రముఖ చలన చిత్ర నిర్మాత శ్రీ రామానాయుడు గారలకు కూడ రాష్ట్ర స్థాయి వైశ్య సంఘాలు తమ అసమ్మతి తెలపడమూ, ఆయిరువ్వురూ ఆ ప్రయత్నాన్ని విరమించు కోవడమూ ఈ పత్రిక వివరంగా తెలిపింది కూడ. మరికొన్ని దిన పత్రికలు కూడ వారి ఆ ప్రయత్న విరమణను ప్రముఖంగానే ప్రచురించాయి.

చింతామణి నాటక ప్రదర్శనను, తమ అసమ్మతిని తెలుపుట ద్వారా జరుగకుండా చేయడమే గాక ఒకటి, రెండు పట్టణాలలో న్యాయస్థానం నుండి కూడ నిలుపుదల ఉత్తర్వులు తెచ్చి ప్రదర్శనను రద్దు చేయించడమూ జరిగింది.

అయినా, "అమ్మదొంగ" అను చలన చిత్రములో 'సునీల్‌సెట్టి' అను పాత్రను చూపిస్తూ, ఆ చిత్ర నిర్మాతలు హాస్య రసాన్ని పోషించు కోవడం ఏ విధంగానూ సమర్థనీయం కాదు. వారనుసరించిన ఈ పద్ధతి వారి కేవలము వైశ్యులే కాదు, ఇతర వర్ణాల వారు కూడ ఉన్నారన్న కనీస స్పృహ కూడ వారికి లేనట్లుగా భావించాలి.

సాటి మనుషులుగా సమ సమాజంలో జీవిస్తున్న వైశ్య సోదరుల మనో వ్యాకులతను గమనించి, ఈ "అమ్మదొంగ" చిత్ర నిర్మాతలు, ఆ చిత్రం నుండి వైశ్య సోదరుల మనస్సులకు నొప్పి కలిగిస్తున్న ఆ దృశ్యాలనూ, సంఘటనలనూ వెంటనే తొలగిస్తారని ఆశిస్తున్నాం.

# విజయవాడలో జరిగిన కేసెట్ విడుదల - బిరుద ప్రదాన - శాసన సభ్యుల సన్మాన కార్యక్రమం వివరాలు



సమాఖ్య అధ్యక్షులు, అవార్డు ప్రదాతలు
శ్రీ కామిశెట్టి సుబ్బారావు గారు

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి ఆర్యవైశ్యుల కులదేవత. శ్రీమంతులైన వారికి కులదేవతగా ఉండి కూడ ఆమెకు ఇతర దేవతలకువలె ఇంతవరకూ అధికారికమైన ఒక సుప్రభాతము కానీ, శతోత్తర సహస్ర నామములు గలిగి శ్రవణానందమునూ, మనస్సుకు ఆహ్లాదాన్నీ కలిగించు ఒక 'కేసెట్' లేక పోవడము విచారకరమూ, లజ్జాకరమూ కదూ!

ముఖ్యమైన ఈ లోపాన్ని గుర్తించిన, కడప, ప్రధాన కార్యస్థానంగా గల శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ అధికారికమైన శ్రీ వాసవీ సుప్రభాత, సహస్రోత్తర నామములు గల కేసెట్‌ను 13.2.1995వ తేదీన విజయవాడలోని శ్రీ లక్ష్మీనారాయణస్వామి ఆర్యవైశ్య కల్యాణ మందిరములో ఇందు కొఱకై ఏర్పాటైన కార్యక్రమములో, మహబూబ్ నగర్ జిల్లా కొడంగల్ శాసన సభ్యులు శ్రీ నందారం వెంకటయ్య గారితో విడుదల చేయించి, ఆ ప్రధానమైన లోటును పూరించి అభినందనీయమైంది.

శ్రీ కన్యకా సుప్రభాతము ఇదివరకే ఉంది కదా! అని కొందరికి అభిప్రాయం కలుగవచ్చు. నిజమే. 1965లో, శ్రీ జూలూరు వీరేశలింగం గుప్తగారు అధ్యక్షులుగా ఉన్నప్పుడు సుప్రభాతం లేని లోపాన్ని గుర్తించిన ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ సుప్రభాత రచనా పోటీని నిర్వహించి, ఆ పోటీకి వచ్చిన



ఈ సమాఖ్య గౌరవాధ్యక్షులు, వైశ్య పతాకాన్ని ఆవిష్కరించిన
శ్రీ బయన వీరరాఘవ రావు గారు



సన్మానితులు, కేసెట్ విడుదల చేసిన శాసన సభ్యులు శ్రీ నందారం వెంకటయ్య గారు

సుప్రభాత రచనలన్నింటినీ పండితుల ద్వారా పరిశీలన చేయించి, గుంటూరు వాస్తవ్యులూ, కీర్తిశేషులు పండిత శ్రీ జమిళి నమ్మాళ్వార్ గారు వ్రాసిన శ్రీ కన్యకా సుప్రభాతాన్ని ఉత్తమమైనదిగా అధికారిక సుప్రభాతంగా మహాసభ ప్రకటించింది. ఆ తరువాత నమ్మాళ్వార్ గారు ఆ తమ కన్యకా సుప్రభాతాన్ని చలనచిత్ర గాయకులు శ్రీ పి.బి.శ్రీనివాస్ గారితో పాడించి, గ్రామ ఫోను రికార్డు చేయించి, వాటిని విక్రయించారు. గ్రామ ఫోనులు ప్రతి ఇంటా ఉండవు కనుక ఆ సుప్రభాతం ఎక్కువగా ప్రచారం కాలేదు. వైశ్య సోదరులు పెక్కురికి ప్రతి ఉదయం వినే భాగ్యాన్ని కలిగించలేదు.

శ్రీ వాసవీ సహస్ర నామములు ఆ పాటి భాగ్యానికి కూడ నోచు కోలేదు. మహా పండితులు, అవధాని శేఖరులు స్వర్గీయ దోమా వెంకటస్వామి గుప్త గారు "శ్రీ కన్యకా శతోత్తర సహస్ర నామావళిః" అను పేర వ్రాయగా శ్రీ మనికొండ కాశీ విశ్వనాథంగారు తమ రామా బుక్ డిపో సంస్థ తరపున ప్రచురించారు. ఆ తరువాత ఈ నామావళి పుస్తకాలు లభ్యం కానందున, స్వర్గీయ పండిటి వెంకటరత్నం గుప్త గారి వద్ద గల ఒకే ఒక ప్రతిని ఈ పత్రికా సంపాదకులు సంపాదించి, తమ "వైశ్య ప్రబోధినీ పబ్లికేషన్సు" సంస్థ తరపున ప్రచురించి, ఆసక్తి కలిగిన వారికి అందుబాటులో ఉంచారు.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ వారు శ్రీ నమ్మాళ్వార్ వారి శ్రీ కన్యకా సుప్రభాతమునూ, శ్రీ దోమా వెంకట స్వామి గుప్త గారి శతోత్తర సహస్ర నామములనూ కమ్మని కంఠముతో, ఇంపైన సంగీతముతో మధురంగా పాడించి, ఈ కేసెట్‌ను తయారుచేశారు.

ఈ కేసెట్‌ను రూపొందించుట ద్వారా ఈ సమాఖ్య వారు ప్రధానమైన రెండు ప్రయోజనాలను సాధించారు. అందులో ఒకటి ఇంతటి శ్రీమంతులైన వైశ్యులకు కులదేవతగా ఉన్న శ్రీ వాసవీ దేవికి సుప్రభాత సహస్రోత్తర నామములతో



సుప్రభాత రచయిత
పండిత శ్రీ జమిళి నమ్మాళ్వారు గారు



సహస్రోత్తర నామావళి రచయిత
శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు

శ్రవణానందమును కలిగించు కేసెట్ లేని లోటును తీర్చడము. రెండవది ఆ రెండింటి రచయితలు, ప్రాజ్ఞులు, పండితులూ, వైశ్యకులచంద్రులూ అయిన పండిత శ్రీ జమిలి నమ్మాళ్వార్, అవధాని శేఖరులూ,మహాకవులూ, గొప్ప పండితులు శ్రీ దోమా వెంకటస్వామిగుప్త గారల పవిత్ర నామములను ప్రతి రోజూ ప్రతి వైశ్యుడూ సంస్మరించుకొనునట్లు చేయడము. సాహిత్యము ద్వారా వీరిద్వరూ 'అమ్మ' ప్రచార విషయములో చేసిన సేవకు వైశ్య జాతి ఎప్పుడూ వీరికి ఋణపడి ఉండక తప్పదు కూడ.

ఈ కేసెట్ విడుదల సందర్భాన్ని పురస్కరించుకొని, స్వాతంత్ర్య సమర యోధులు, తామ్రపత్ర గ్రహీతలూ, నిజాం ప్రభువుల కాలములో జరిగిన తెలంగాణా స్వాతంత్ర్యోద్యమంలో రజాకార్ల కటికు కత్తులకు రొమ్ముునొడ్డి నిలిచిన శ్రీ కె.సి.గుప్త గారికి ఈ సమాఖ్య ప్రతి యేటా ఇవ్వదలచుకొన్న గదర్ వీరులు శ్రీ దర్శి చంచయ్య గుప్త అవార్డునూ, ఆంధ్రప్రదేశ్ 10వ శాసనసభకు నూతనంగా ఎన్నికైన మహబూబ్ నగర్ జిల్లా కొడంగల్ నియోజక వర్గశాసనసభ్యులు శ్రీ నందారం వెంకటయ్య గారికి సన్మానమూ, నిత్య నూతనోత్సాహముతో స్వసంఘ సేవనూ, సమాజ సేవనూ చేస్తున్న విజయవాడ పుర ప్రముఖులూ, ఈ సమాఖ్యకు ఉపాధ్యక్షులూ, విజయవాడలోని శ్రీ లక్ష్మీ నారాయణస్వామి ఆర్యవైశ్య కల్యాణ మందిర సంఘానికి అధ్యక్షులూ అయిన శ్రీ గద్దం సుబ్బరావు గారికి "వైశ్యరత్న" బిరుదును ప్రదానము చేయుట ఆ రోజు అనగా 13.2.1995వ తేదీ సాయంత్రం 6 గంటలకు జరిగిన ఆ కార్యక్రమములో జరిగాయి.

సభ ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘముల సమాఖ్య వారు గతంలో తయారు చేయించిన శ్రీ వాసవీ ప్రార్థనా గీతముతో ప్రారంభమైంది. ఈ సమాఖ్య గౌరవాధ్యక్షులూ, విజయవాడ పుర ప్రముఖులూ, 'సర్దార్', 'కళాప్రియ' ఇత్యాది బిరుదాలతో విరాజితులూ అయిన శ్రీ బయన వీరరాఘవరావు గారు ఈ సందర్భంగా వైశ్య పతాకాన్ని



ప్రధాన కార్యదర్శి
శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు



ముఖ్య అతిథి
శ్రీ జి.వి. గున్నయ్య శ్రేష్ఠి గారు

ఆవిష్కరించారు. వైశ్యపతాకావిష్కరణా నంతరము, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘముల సమాఖ్య వారు గతంలో రూపొందించిన వైశ్యపతాకగీతం ఆలాపన జరిగింది.

"సంఘోద్ధారక" "ఏజెంట్ రత్న" ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘముల సమాఖ్య మాజీ అధ్యక్షులూ, విజయవాడ పట్టణ ప్రముఖులూ, శ్రీ కూరపాటి కృష్ణమూర్తి గారు ఆహ్వానించగా, ఈ సమాఖ్య అధ్యక్షులూ, ప్రొద్దుటూరు పురప్రముఖులూ "ప్రజాబంధు" "దానశీల" శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు వేదికకు అరుదెంచి, సభాధ్యక్షులుగా తమ స్థానాన్ని అలంకరించి సభను నిర్వహించారు. తదుపరి కృష్ణమూర్తి గారి స్వాగతము, ఆహ్వానముతో వేదికను అలంకరించిన ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య మాజీ అధ్యక్షులూ, బందరు పురప్రముఖులూ శ్రీ గుడివాడ వెంకట గున్నయ్య శ్రేష్ఠి గారు ముఖ్య అతిథులుగా తమ ఉపన్యాసములో ఈ సమాఖ్య కృషిని ప్రత్యేకించి, ఈ కేసెట్‌ను తయారు చేయించుటలో చూపిన శ్రద్ధనూ ప్రశంసించారు.

శ్రీ కృష్ణమూర్తి గారు ఆహ్వానించగా సన్మానితులుగానూ, గౌరవనీయులుగానూ, శాసనసభ్యులు శ్రీ నందారం వెంకటయ్య గారు వేదికకు విచ్చేసి తమ గౌరవ స్థానాన్ని అలంకరించి, తమ కరకమలాలతో ఈ 'కేసెట్'ను విడుదల చేసి, సమాఖ్య కృషిని ఉగ్గడించుటతో బాటు వర్తమాన పరిస్థితులలో వైశ్య సోదరులు సంఘము యెడల తీసుకోవలసిన మెలకువలను తమ ప్రసంగములో వివరించారు.

శ్రీ కూరపాటి వారి సుమధుర వచనాలతో వేదికకు విచ్చేసి, సభా ప్రారంభకులుగా తమ స్థానాన్ని అధిరోహించిన, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య అధ్యక్షులూ, 'నిర్మాణరత్న' బిరుదాంకితులూ, జెమ్ ఆఫ్ ఇండియా మొదలగు పలు ప్రతిష్ఠాత్మక అవార్డులను గడించిన హైదరాబాద్ నగర ప్రముఖులు శ్రీ మేడా నరసింహులు గారు ఈ సభను ప్రారంభించారు.



దర్భి చంచయ్య గుప్త అవార్డును
తీసుకొన్న శ్రీ కె.సి.గుప్త గారు



'వైశ్యరత్న' బిరుదును స్వీకరించిన
శ్రీ గడ్డం సుబ్బరావు గారు

అనంతరము, కేసెట్ విడుదల కర్తగా వ్యవహరించిన శాసనసభ్యులు శ్రీ నందారం వెంకటయ్య గారికి ఘనంగా సన్మానం జరిగింది.

ఆ పిదప, ఈ సమాఖ్య ఆధ్యక్షులూ, "ప్రజాబంధు" "దానశీల" బిరుద ప్రకాశితులూ శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఈ సమాఖ్య ప్రతియేటా ఇవ్వతలపెట్టిన శ్రీ దర్శిచంచయ్య గుప్త అవార్డుగా, స్వాతంత్ర్యసమరయోధులు శ్రీ కె.సి.గుప్త గారికి వెయ్యి రూపాయల నగదు, ధృవ పత్రమునూ ఇవ్వగా, శ్రీ కూరపాటి కృష్ణమూర్తి గారు గుప్త గారికి శాలువాను కప్పి, జ్ఞాపికను బహూకరించారు. దర్శిచంచయ్య గుప్త అవార్డుకు గానూ రు.1500/-లు తమ శ్రీ కామిశెట్టి సుబ్బరావు, చెన్నమ్మ ట్రస్టు నుండి శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారే ఇచ్చి ఈ సమాఖ్యకు సహకరించారు.

ఆ తదుపరి బిరుద ప్రదాన కార్యక్రమం జరిగింది. విజయవాడ పురప్రముఖులు శ్రీ గడ్డం సుబ్బరావు గారికి ఇచ్చిన ఈ బిరుద ప్రధాన కార్యక్రమములో సమాఖ్య ఆధ్యక్షులు శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఈ సమాఖ్య పక్షాన "వైశ్యరత్న" అను బిరుదును ఇచ్చి, పుష్ప మాలాంకృతుని చేయగా, ఈ సమాఖ్య కోశాధికారి, శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం ఆధ్యక్షులు, ప్రొద్దుటూరు పుర ప్రముఖులూ, శ్రీ జూటూరు రమణయ్య గారు బిరుద గ్రహీతలు శ్రీ సుబ్బరావు గారికి శాలువను కప్పి ఈ సమాఖ్య పక్షాన జ్ఞాపికను బహూకరించారు బిరుద ప్రదానము ముగిసిన పిదప అనేకమంది అభిమానులూ, సంఘాల నిర్వాహకులూ శ్రీ గడ్డం సుబ్బరావు గారిని శాలువలతోనూ, నూతన వస్త్రములతోనూ, పుష్పమాలల తోను సత్కారించి, వారి యెడ తమకు గల అభిమానాన్ని ప్రకటించుకొన్నారు.

కూరపాటి ఇంటి చంద్రులు కృష్ణుని ఆహ్వానముతో వేదికకు అరుదెంచి, తమ స్థానాన్ని అలంకరించిన, ప్రార్థనా గాన సంఘాధ్యక్షులూ, విజయవాడ పుర ప్రముఖులూ, ఆచార్య శ్రీ గట్టి సత్యనారాయణ గుప్త గారు శ్రీ వాసవీ పురాణములోని శ్లోకాలను తమ చక్కని అర్థ జ్ఞానముతోనూ, కమ్మని కంఠంతోనూ



ఈ కార్యక్రమం విజయవంతం అయ్యేందుకు కృషిచేసిన శ్రీ కూరపాటి కృష్ణమూర్తి గారు



సభా ప్రారంభకులు
శ్రీ మేడా నరసింహులు గారు

చదివి అందరి శైలీ రమ్యతను విశదీక రించుటతో బాటు - ఈ కేసెట్‌ను విడుదల చేయించి, ఈ సమాఖ్య ఇంత వరకూ ఉన్న ఒక ప్రధాన లోపాన్ని పూరించిందనీ, ఈ రోజు సుదినమనీ, ఆర్య వైశ్యుల చరిత్రలో ఒక మైలు రాయి అనీ ప్రసంగించారు.

విజయవాడ చేంబర్ ప్రసిడెంట్ శ్రీ గడ్డం సుబ్బరావు, ఈ సమాఖ్య కృషినీ, ఆనాటి ఈ కార్యక్రమ విశిష్టతనూ ఉగ్గడించారు.

ఈ యావత్తు కార్యక్రమాన్నీ అక్కడ జరుపు కొనుటలో సంపూర్ణంగా సహక రించిన, విజయవాడ వైశ్య ప్రముఖులూ, శ్రీ లక్ష్మీ నారాయణస్వామి ఆర్యవైశ్య కల్యాణ మందిర సంఘం కార్యదర్శి శ్రీ చలువాది శ్రీనివాసరావు గారిని ఈ సమాఖ్య పక్షాన ఉపాధ్యక్షులు శ్రీ ఓరుగంటి బాల క్రిష్ణయ్య గారు శాలువాను కప్పి, పుష్ప మాలాంకృతులు గావించగా, మరో ఉపాధ్యక్షులూ శ్రీ ధారా రామ నరసింహం గారు ఈ సమాఖ్య పక్షాన జ్ఞాపికను బహూకరించారు.

ఈ శుభ సందర్భాన్ని పురస్కరించు కొని, ఈ సమాఖ్య న్యాయసలహా విభాగ సభ్యులుగా ఉంటూ-గత నాలుగేండ్లుగా, ఈ సమాఖ్య సభ్యసంఘాలు ఎదుర్కొను పలు ప్రభుత్వ పరమైన సమస్యలకు, ముఖ్యంగా దేవాదాయ ధర్మాదాయ శాఖాధికారులు ఉత్పన్నం చేసే సమస్యలకు చక్కటి పరిష్కారాన్ని న్యాయశాస్త్ర పరిధిలో చూపిస్తూ, రాష్ట్రములోని శ్రీ వాసవీ దేవ్యాలయాల, ఆర్యవైశ్య ధర్మ సంస్థల యొక్క ఉనికినీ, స్వతంత్ర ప్రతి పత్తినీ సంరక్షించుకొనుటలో ఈ సమాఖ్య గత నాలుగేండ్లుగా చేస్తున్న కృషికి అనిర్వచ నీయంగా సహకరిస్తున్న ప్రసిద్ధ న్యాయ వాదులు, భీమవరం వాస్తవ్యులు శ్రీ తమ్మన వెంకటరత్నం గారిని, ఈ సభలో ఈ సమాఖ్య తరపున అధ్యక్షులు శ్రీ సుబ్బరావు గారు శాలువాను గప్పి సన్మానించగా, కార్యదర్శి శ్రీ బొగ్గవరపు సుబ్బరావు గారు పుష్పమాలాలంకృతులు గావించారు. కార్యదర్శులు శ్రీ ఇల్లూరు శంకరయ్య గుప్త, శ్రీ నాగెళ్ళ గౌరీశంకర్ గారలు ఈ సమాఖ్య తరపున శ్రీ వెంకటరత్నం గారికి



సమాఖ్య కోశాధికారి, బిరుద స్వీకృతకు జ్ఞాపికను బహూకరించిన
శ్రీ బాటూరు రమణయ్య గారు



ప్రధానోపన్యాసకులు
ఆచార్య శ్రీ గట్టి సత్యనారాయణ గుప్త గారు

జ్ఞాపికను బహూకరించారు.

ఈ సమాఖ్య న్యాయసలహా సంఘ సభ్యులు శ్రీ సి.వి.సత్యనారాయణ శ్రేష్ఠి గారలు వేదికను అలంకరించిన వారిలో ఉన్నారు.

సభా ప్రారంభానికి ముందు ఈ సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ పి.లక్ష్మీ కాంతం శ్రేష్ఠి గారు తమ నివేదికను సమర్పిస్తూ, 1989 సెప్టెంబరు 23వ తేదీన ప్రారంభమైనప్పటి నుండీ ఇంత వరకూ, ఈ సమాఖ్య చేసిన కృషినీ - సాధించిన ప్రగతినీ - గడించిన విజయాలను సభకు వివరించారు. ఇంతే కాకుండా, దర్శి చెంచయ్య గుప్త అవార్డును మరు సంవత్సరము కూడ ఈ సమాఖ్య ఇస్తుందనీ, ప్రామాణిక ప్రతికి తుది రూప మిచ్చామనీ, - అతి త్వరలో ముద్రించి, ప్రపంచానికి అందిస్తామనీ, - ఈనాడు మన వైశ్య విద్యార్థినీ, విద్యార్థులలో పలువురు వివిధ విశ్వ విద్యాలయాలూ ప్రతి సంవత్సరము నిర్వహిస్తున్న స్నాతక, స్నాతకోత్తర పరీక్షల్లో సర్వ ప్రథములుగా వచ్చిన వారినో, అతి పెద్ద సంఖ్యలో మార్కులు సంపాదించిన వారినో - గుర్తించి గౌరవించి, వారి ప్రతిభను చాటే రాష్ట్రస్థాయి వైశ్య సంస్థ - ఇప్పుడు ఏదీ లేదనీ - ఆ లోటును గుర్తించిన ఈ శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ అట్టి వైశ్య విద్యార్థినీ, విద్యార్థులకు స్వర్ణ పతకములను బహూకరించుటతో బాటు వారి ప్రతిభకు గుర్తింపునూ, వారికి గౌరవాన్ని ఆపాదించుటకు గానూ ఇక ముందు ప్రతి యేటా స్వర్ణపతకములను బహూకరించు కార్యక్రమాన్ని చేపట్టాలన్న ఈ సమాఖ్య ఆధ్యక్షుల అభిప్రాయాన్ని వివరిస్తూ ఇందుకు గానూ వెయ్యి రూపాయలు విరాళంగా ఇచ్చిన వారి పేర ఒక స్వర్ణ పతకాన్ని బహూకరిస్తుందనీ ఉదార హృదయముతో ఈ సభలో ఉన్న వారిని ముందుకు రావలసిందిగా విజ్ఞప్తి చేశారు. ఈ విజ్ఞప్తికి స్పందించిన విజయవాడ వైశ్య ప్రముఖులూ, ప్రభుత్వ పశు సంవర్ధక శాఖలో ఉప దర్శకులుగా పనిచేసి పదవీ విరమణ చేసిన డాక్టర్



సమాఖ్య న్యాయ విభాగ సభ్యులు,
న్యాయవాదులు
శ్రీ సి.వి.సత్యనారాయణ శ్రేష్ఠి గారు



కార్యదర్శుల్లో ఒకరు
శ్రీ ఇల్లూరు శంకరయ్య గుప్త గారు

టి.వి.లోకనాథరావు గారలు తమంతట తామే ముందుకు వచ్చి "ఈ మంచి కార్యానికి వెయ్యి రూపాయలు కాదు ఒక్క వెయ్యి ఒక్క వంద పదహారు రూపాయలు పెట్టండి" అని సూచించుటతో బాటు తమ స్వంతు విరాళాన్ని ప్రకటించారు. (డి.డి. ద్వారా పంపారు కూడ) సమాఖ్య అధ్యక్షులు శ్రీ సుబ్బరావు గారు ఇందుకు వీరిని ఘనంగా సన్మానించారు.

ప్రధాన కార్యదర్శి తమ నివేదికలో శ్రీ దర్శి చంచయ్య గుప్త గారి పేర ప్రతి యేటా ఇవ్వాలనుకొన్న అవార్డుకు రూ.1500/-లు విరాళ మొత్తంగా నిర్ణయించామనీ, ఆ విధంగా రూ.1500/-లు విరాళంగా ఇచ్చిన వారు తమ కరకములాలతోనే ఈ అవార్డును నిర్ణయించిన వారికి ఇవ్వవచ్చునని కూడ చెప్పారు.

సభాధ్యక్షులుగా, ముఖ్య అతిథినీ, కేసెట్‌ను విడుదల చేసిన శాసనసభ్యున్ని, వేదికను అలంకరించిన తదితరులకు ఈ కార్యక్రమాన్ని నిర్వహించుటకు గాను ప్రత్యేకంగా ఏర్పాటైన ఆహ్వాన సంఘము తరపున ఆ సంఘం అధ్యక్షులు శ్రీ గడ్డం సుబ్బరావు గారు తమ ధనంతో శాలువాలు గప్పి గౌరవించగా, విజయవాడ వైశ్య ప్రముఖులూ, విలాస్ అధినేత శ్రీ తటవర్తి సూర్యనారాయణ గారు తమ ధనముతో జ్ఞాపికలను బహూకరించారు. శ్రీ కన్యకా పరమేశ్వరీ అన్న సత్ర సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ బచ్చు వెంకట నరసింహ రావు గారు వందన సమర్పణ చేశారు.

ఈ కార్యక్రమాన్ని జరపాలన్న ఆలోచన మొదలైనప్పటి నుండి కార్యక్రమం విజయవంత మయ్యేంత వరకూ శ్రీ కూరపాటి కృష్ణమూర్తి గారు కొలికి పూసగా నిలిచి, ఎంతో శ్రమించి అభినందనీయులనిపించు కొన్నారు.

సభా కార్యక్రమానంతరము విజయవాడ వైశ్య ప్రముఖులు విక్రమ్ పబ్లిషర్స్ ప్రొప్రయిటర్ శ్రీ రావికింది రామస్వామి గారలు తమ ధనంతో అందరికీ కమ్మని వంటకాలతో విందు భోజనాన్ని ఏర్పాటు చేశారు. సభా ప్రారంభములో శ్రీ రామస్వామి గారే జ్యోతి ప్రజ్వలనను చేశారు.



కార్యదర్శుల్లో ఒకరు
శ్రీ బొగ్గవరపు సుబ్బరావు గారు

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

## రంగాగారి రాజకీయాలు

కాంగ్రెసు రాజకీయలమీద ఎంత తీవ్రంగా విమర్శనలు జరిగినవో అదే రీతిగా ఆచార్య రంగాగారి రాజకీయాలమీద చర్చలు జరిగాయి. విద్యార్థులు సామాన్యులు కారు; షుమారు 20సం॥ల మొదలు 40సం॥ల వయస్సు గలవారు, రెండుమూడుసార్లు కాంగ్రెసు ఉద్యమాలలో జైళ్లకు వెళ్ళిన వారు. రాజకీయ విషయాలలో చక్కని అనుభవం గలవారు. కాబట్టి అభ్యుదయ వాదియని వుండే పేరు గాంచిన రంగాగారి రాజకీయాలకు, యితర పార్టీల రాజకీయాలకు వుండే వ్యత్యాసాలను బాగా తెలుసుకోవాలని అభిలాషతో డాక్టరు కృష్ణ గారి సహాయం కోరారు.

అంతట రంగాగారు వ్రాసిన గ్రంథములపై రచ్చ జరిగింది. రంగాగారు చర్చలో పాల్గొనలేదు; కాని వింటూ కూచున్నారు. వారి గ్రంథాల్లో పరస్పర వైరుధ్యాలు ఉన్నట్టున్నూ, ఒకే అధ్యాయంలో ఒక ప్యారాగ్రాఫ్‌కు మరొక ప్యారాగ్రాఫ్‌కు పరస్పర వైరుధ్యం ఉన్నట్టు, చివరకు ఒకే ప్యారాలో మొదటి వాక్యానికి, చివర వాక్యాలు విరుద్ధంగా ఉన్నట్టు నిరూపించగా అందరూ ఆశ్చర్యపడ్డారు. ఆఖరున కృష్ణగారు "రంగాగారు చాలా చదివారు. వారి పుస్తకాలలో చాల భోగట్టా వున్నది. కాని, ఆయన ఆ విషయాలను జీర్ణం చేసుకోలే" దన్నారు. అయినా రంగాగారు మాట్లాడలేదు.

మరికొన్ని రోజులకు ఆచార్య రంగా గారి రాజకీయాలను గురించి చర్చ జరిగింది. ఒకే సమస్యమీద దేశంలోని మూడు పార్టీలవారి తీర్మానాలను పరిశీలించాము. అవి కాంగ్రెసు, కమ్యూనిస్టు, కిసానుసభల తీర్మానాలు. కమ్యూనిస్టు పార్టీ తీర్మానంలోని ఉపోద్ఘాతాన్నీ (ప్రియాంబుల్), కాంగ్రెసు తీర్మానంలోని కార్యాచరణకు సంబంధించిన భాగాన్ని (ఆపరేటివ్ పోర్షన్) కలిపితే రంగాగారి కిసానుసభాతీర్మానాలు ప్రత్యక్షమైనాయి. అందువల్ల డాక్టరు కృష్ణగారు యీ విధంగా నిర్ధారణ చేశారు :- "కమ్యూనిస్టుల అతివాదభాష, కాంగ్రెసు వారి మితవాద కార్యక్రమముల కలగలుపే రంగాగారి రాజకీయ పంథాగా వున్నది."

రంగాగారికి కోపం వచ్చింది. మౌనంగా వుండలేకపోయారు. "ఇక్కడ మీ యిష్టంవచ్చినట్టు వాగండి. బయటకు పోయిన తరువాత ప్రజలవద్ద మాట్లాడి సమర్థించుకోండి. చూతాం" అని బెదిరించి మీటింగులో నుంచి లేచి వెళ్లారు.

## చర్చలు, కోపాలు

మరొకప్పుడు ఒక సమస్యను గురించి

చర్చ జరిగింది. "అహింసా విధానంవల్ల స్వరాజ్యం రాగలదా?" అన్న విషయాన్ని గురించిన చర్చ. అందరూ తమతమ అభిప్రాయాలను తెలుపవచ్చునని కోరారు. కాంగ్రెసు వాదులు దానిలో పాల్గొనకూడదని డాక్టరు పట్టాభిగారు సలహా యిచ్చారు. కాని స్పీకరు సాంబమూర్తిగారు ఏకీభవించలేదు. కాంగ్రెసు వాదులైనవారు తప్పక చర్చలో పాల్గొనాలని వారి అభిప్రాయం. అయితే వారి అభిప్రాయం ప్రకారం పాల్గొన్న కాంగ్రెసు నాయకులు వారొక్కరే. మామూలు ప్రకారం డాక్టరు కృష్ణగారు అధ్యక్షులు. ఒక్కొక్కరి ఉపన్యాసానంతరం దానిని గురించి తన అభిప్రాయాన్ని యిస్తూండే వారు. స్పీకరు సాంబమూర్తిగారు చాలా సేపు ఉపన్యసించారు. అంతట కృష్ణగారు తన అంత్య నిర్ణయాన్ని యిలా చెప్పారు:- స్పీకరు సాంబమూర్తిగారి ఉపన్యాసధోరణి అజ్ఞానులైన పల్లె ప్రజల ఎదుట మాట్లాడినరీతిగా ఉన్నదేకాని, విజ్ఞానులైన దేశభక్తులముందు శాస్త్రోక్తంగాను. తార్కికంగాను మాట్లాడలేదు" అన్నారు.

కాంగ్రెసు నాయకులకు మాత్రం కోపాలువచ్చాయి. "కమ్యూనిస్టులతో చేరవద్దు; మన మర్యాద కాపాడుకోవాలంటే వారితో చర్చించ కూడదు" అని పట్టాభిగారు అన్నారట.

## "నే నెందుకు కమ్యూనిస్టు నయ్యాను"

ఆ రెండు సంవత్సరాలలో రాజకీయ చర్చలకు అంతమే లేదు. "నేను ఎందుకు కమ్యూనిస్టునయ్యాను?" అని ఒక్కొక్కరు మాట్లాడాలి. జెయిలుకు వచ్చిన వారిలో ఎక్కువమంది కాంగ్రెసు వారే. వారిలో నాయకులు కొద్దిమంది, అనుచరులు చాలామంది. అనుచరులు కమ్యూనిస్టులుగా మారిపోసాగారు. ఈ విధంగా కమ్యూనిస్టులయినవారే తామెందుకు కమ్యూనిస్టులయ్యారో ఉపన్యసించాలి. ప్రతి ఉపన్యాసానంతరం చర్చ జరుగుతుంది. వారందరూ కాంగ్రెసులో పని చేసేవారే. కాంగ్రెసు నాయకులకు జమీందారీ వర్గంమీదా, పెట్టుబడిదారీ వర్గంపైన వున్న సానుభూతినీ, కష్ట జీవులయిన కార్మిక కర్షకులయందు గల అలక్ష్యభావాన్ని నిరసించారు. అంతేకాక ఎలక్షన్లలో అనేకులు చేయుచుండిన మోసాలను బయటపెట్టారు. నాయకులలో వ్యక్తి సంబంధమైన కక్షలు, అధికారాపేక్షలు, అంతఃకలహాలు, కట్టుగా కలిసి పని చేయలేక పోవడం, ఒకరు మరొక దేశ భక్తునికి చేయుచున్న ద్రోహము మొదలైన కుళ్ళును బయటపెట్టారు. దీనితో జెయిలు లోని కాంగ్రెసు నాయకులకు కమ్యూనిస్టులతో కలసి వుండడమే కష్ట మనిపించింది.

## తర్కవితర్కాలు

ఈవిధంగా రెండు ముఠాలుగా తయారైన సమయంలో శ్రీ రవీంద్రనాథ ఠాగూరుగారు మరణించారు. వారి గౌరవార్థం మీటింగు జరిగింది. డాక్టరు పట్టాభిగారు అధ్యక్షత వహించాలని అందరం కోరాము. కాని పట్టాభిగారు ఒక షరతు ఒప్పుకోమని అడిగారు. తాను మాట్లాడి ముగించిన తరువాత యింకెవరూ మాట్లాడకూడదని వారి షరతు.

కొందరు ఒప్పుకోలేదు. అందువల్ల స్పీకరు సాంబమూర్తిగారు అధ్యక్షత వహించారు. డాక్టరు కృష్ణగారు తన ఉపన్యాసాన్ని చదివారు. ఠాగూరుగారిని మహాత్మా గాంధీగారితో పోల్చి మాట్లాడారు. గాంధీ గారు మహాదేశ భక్తి గల వ్యక్తి "(a great dynamic Personality)" అనీన్నీ, ఠాగూరుగారిలో ఆశక్తి లేదనీ చెప్పారు. అయితే ఠాగూరుగారి అభిప్రాయాలు ఎక్కువ అభ్యుదయకరంగా ఉన్నట్లు ఉదాహరణలను గ్రంథాలలో నుండి చదివి వినిపించారు. గాంధీగారి రామరాజ్యం అభివృద్ధి నిరోధకమని నిరూపించారు. ఠాకూరుగారిది ముందు చూపు అనీ, గాంధీగారిది వెనుకచూపు అనీ చెప్పారు.

కాంగ్రెసు నాయకులకు ఆగ్రహం వచ్చింది. "ప్రపంచంలో మహాత్మాగాధీ గారితో పుజ్జీ అయిన గొప్పవ్యక్తి జన్మించలేదన్న ధోరణిలో స్పీకరుగారు ఉపన్యసించారు. కాంగ్రెసు వాదులను, వారి నాయకులను డాక్టరు కృష్ణగారు అవమానపరిచారని విర్శించారు. వాదాలు ముదిరాయి. "నా అభిప్రాయాలను గ్రంథసహాయంతో నిరూపించుటాను; ఒక కమిటీని యేర్పరచు" మని కృష్ణగారు సవాలు చేశారు; స్పీకరుగారు ఆ సవాలును అంగీకరించలేదు.

## నవచైనా

కాంగ్రెసు నాయకులకు, కమ్యూనిస్టు యువకులకు జరుగుచుండిన తర్కా-వితర్కాలను (Intellectual Competition Descussions) గురించి, నాయకుల ఓటమిని గురించిన ఈ అధ్యాయాన్ని పూర్తి చేసే ముందు మరొక ఉదాహరణను వ్రాస్తాను.

ఈ వాగ్వాదాలలో సాధారణంగా శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు జోక్యం కల్పించుకోవడంలేదు. కాని, నాయకుల పక్షానికి ఓటమి కలిగినప్పుడు అందరికంటె ఎక్కువగా కోపపడుతూండేవారు. యువకుల శక్తిసామర్థ్యాలను డాక్టరు పట్టాభిగారు గ్రహించారు. కాని, శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు మాత్రం గ్రహించలేదు.

వారు అంతర్జాతీయ సమస్యలను బాగా చదివి, గ్రంథాలుకూడా వ్రాసియున్నారు. ముఖ్యంగా టర్కీలోను, చైనాలోను జరిగిన విప్లవాలను గురించి వ్రాశారు. కాబట్టి చైనా విప్లవాన్ని గురించి వుపన్యసించుతానని శ్రీ పంతులుగారు కమ్యూనిస్టులకు తెలియపరిచారు.

తన ఉపన్యాసాన్ని ఆనాడు 1925 సంవత్సరంతో పూర్తిచేశారు. యువకులు తమ సంశయాలను తీర్చుకొనుటకు ప్రశ్నలు వేశారు. అది మామూలే, కాని పంతులుగారు సమాధానం చెప్పేందుకు నిరాకరించారు. ఒక విద్యార్థి లేచి ప్రశ్నలన్నిటికీ సమాధానం చెప్పాడు. పంతులుగారికి ఆశ్చర్యం కలిగినది.

కాని, యువకులు పంతులుగారిని అంతటితో విడిచిపెట్టలేదు. 1925 సంవత్సరం మొదలు 1940 సంవత్సరం వరకూ చైనాలో జరుగుతూన్న పరివర్తనను గురించి ఉపన్యసించవలసిందిగా కోరారు. తనకు తెలియదని పంతులుగారు ఒప్పుకున్నారు. ఒక యువకుడు మరునాడు ఆ విషయాన్ని పూర్తి చేశాడు. ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. ఆ

మీటింగుకు పంతులుగారే అధ్యక్షత వహించారు.

కమ్యూనిస్టు యువకులు జాతీయ, అంతర్జాతీయ రాజకీయ సమస్యలను గురించి ఎంత తీవ్రంగా, ఎంత సమగ్రంగా చదివి గ్రహించుకుంటున్నారో తుదకు శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు కూడా ఒప్పుకోవలసి వచ్చింది.

కాంగ్రెసు నాయకులు బుద్ధి కౌశల్యములోను, విజ్ఞానంలోను కమ్యూనిస్టు యువకులతో ఓడిపోతూ వచ్చారు. దాని ఫలితంగా కాంగ్రెసు వాదులు కమ్యూనిస్టులుగా మారిపోతూ వచ్చారు.

ఈ విషయాలను యింతటితో ముగించి ఈ రెండుపార్టీలవారి ప్రవర్తనను గురించి కొంత వ్రాస్తాను.

## నిరశన వ్రతము—కాంగ్రెసు నాయకులు

పై కారణంవల్ల మాత్రమే 160 మంది కమ్యూనిస్టులుగా మారిపోయారని తలచకూడదు. జైలు జీవితంలో ఎన్నో క్లిష్ట సమస్యల నెదుర్కోవలసి వస్తుంది. ఆ ఎదుర్కోవడంలో పార్టీలవారీగా ఎవరి పంథా ప్రకారం వారు తమ తమ సమస్యలను పరిష్కరించుకుంటూ వచ్చారు. పరిష్కారాలలో అభిప్రాయభేదాలు, తగాదాలు కలుగుతూ వచ్చాయి. ఇంతవరకు తర్క వితర్కాలలోని కొన్ని వ్యత్యాసాలను వివరించాను. మరి కొన్ని ముఖ్య సమస్యలను ఏ పార్టీ ఏలా ఎదుర్కొన్నదీ వ్రాస్తాను.

డిటెన్యూల సంఖ్య పెరగగానే ప్రభుత్వం రెండు తరగతులుగా విభజించింది. ప్రథమంలో ఎంతో న్యాయంగా చెయ్యవలసిన సౌకర్యాలను చేసింది; కాని, ఆ పాలసీని మార్చుకొన్నది. షుమారు 25 మందిని మాత్రమే మొదటి తరగతి వారికి మామూలు వసతులన్నీ ఇవ్వబడినై, అధికసంఖ్యాకుల రెండో తరగతి వారిని నేరంచేసి శిక్ష ననుభవించే మామూలు ఖైదీల స్థితికి మార్చారు. భోజనానికి రోజుకు ఆరు అణాలకు మారుగా రెండు అణాలు మాత్రమే; దుస్తులుకూడా అలాగే; ఉత్తరాలు అంతే. స్వంత డబ్బుకూడా ఉపయోగించుకోకూడదు.

అప్పట్లో కమ్యూనిస్టులు ఏ పదిమందో వుండేవారు. మిగిలినవారు కాంగ్రెసు నాయకులు, వారి అనుచరులు. ఎవరూ ఈ మార్పులను ఒప్పుకోలేదు. అయితే, గవర్నమెంటు లక్ష్యపెట్టలేదు. డిటెన్యూలు నిరశన వ్రతం ప్రారంభించారు. కాంగ్రెసు నాయకులు, ముగ్గురు నలుగురు రంగా పార్టీవారు మొత్తం పాతికమంది నిరసనవ్రతంలో చేరుటకు నిరాకరించారు. చేరుతామన్నవారిలో యిద్దరు వ్యాధి గ్రస్తులను చేరకూడదని తతిమ్మా 85 మంది ఏకగ్రీవంగా తీర్మానించారు. ఆ ఇద్దరిని మాత్రం నిరశనవ్రతానికి సంబంధించిన వ్యవహారాలను చూచు కోమని కోరారు. ఆ ఇద్దరిలో ఒకరు బాలచంద్రమీనన్, రెండో వ్యక్తిని నేను. ఈ నిరశనవ్రతం జయప్రదం కాకూడదని కాంగ్రెసు

నాయకులలో ఇద్దరు ముగ్గురు పట్టుదలతో పని చేశారు. వారిలో ముఖ్యులు శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు. మూడు నాలుగు రోజులలో ఈ నిరశనవ్రతం భగ్న మవుతుంది; మానేస్తారని ప్రచారం ప్రారంభించారు. ఆ నాలుగు రోజులు అయిన తరువాత "వీరేదే దొంగతనంగా తింటూండాలి" అని ప్రచారం సాగించారు. మధ్యలో నిలిచిన వారిని అభినందించారు. రాజీ మాటలలో జోక్యం కలుగ జేసుకొని విచ్చేదానికి ప్రయత్నించారు. జెయిలు బయట చాలమంది దేశభక్తులు బహిరంగ సభలు జరిపి, డెప్యుటేషన్లు తీసుకువెళ్ళి విజయవంతంగా అంతమయ్యేవరకూ సహాయం చేస్తూనే వున్నారు. వారిలో ముఖ్యులు: శ్రీ జగన్నాధదాసు, యస్.కృష్ణమూర్తి, దరిశి సుభద్రమ్మ, వి.భాష్యంఅయ్యంగారు, ఆర్. సూర్య నారాయణరావు, న్యాయపతి నారాయణ మూర్తిగార్లు. పందొమ్మిది రోజులు వ్రతం జరిగింది. చివరకు పూర్తిగా జయం లభించింది. దేశమంతా సంతోషించింది. కాని, మాతోనేవున్న కాంగ్రెసు నాయకులు చాలమంది హర్షించలేకపోయారు.

(ఇంకా ఉంది)

# గుప్త గారి శ్రీ కన్యకా పురాణ ప్రచురణకు తోడ్పడండి

## – శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం విజ్ఞప్తి

మహాకవులు,అవధాని శేఖరులు శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు వ్రాసిన శ్రీ కన్యకాపురాణ ప్రచురణను పై పీఠం వారు ఆరంభించారు. రూ.116/-లు పంపి ఈ ప్రచురణకు తోడ్పడ వలసిందిగా పై పీఠము వారు విజ్ఞప్తి చేస్తున్నారు. రూ.116/-లు పంపిన వారికి ఒక ప్రతిని పంపుతారు. అట్టివారు పీఠములో జీవిత సభ్యులుగా కూడ ఉంటారు.రూపాయలను డి.డి.ద్వారా పంపువారు ఆ డి.డి.ని 'శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠము' పేర ప్రొద్దుటూరులోని ఏ షెడ్యూలు బ్యాంకులోనైనా నగదు అగునట్లుగా, శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం, కేరాఫ్ వైశ్య ప్రబోధినీ కార్యాలయం, జయనగర్ కాలనీ, కడప – 516 002 అడ్రసుకు పంపాలి. రూపాయలను యం.ఓ ద్వారా పంపువారు నేరుగా పై అడ్రసుకే పంపవచ్చు.

గుప్త గారి గ్రంథాలు వెలుగు చూచుటకు తోడ్పడడం ప్రతి వైశ్యుడూ తమ విధిగా, కర్తవ్యంగా భావించాలి.

ఇంతవరకూ అందిన విరాళాలు

రూ.116-00 శ్రీ రామయ్యగారు, నంద్యాల (యం.ఓ)

రూ.116-00 శ్రీ తుమ్మలపల్లి సుబ్రమణ్యం గారు, తణుకు (డి.డి)

రూ.116-00 శ్రీ అరిశెట్టి గున్నయ్య గుప్త, సాలూరు.

# వైశ్య ప్రబోధిని – క్యాలెండరు

( 1995 మార్చి 21 నుండి 1995 ఏప్రిల్ 20 వరకు )

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 26 | 2 | 9 | 16 |
| సోమవారము | | 27 | 3 | 10 | 17 |
| మంగళవారము | 21 | 28 | 4 | 11 | 18 |
| బుధవారము | 22 | 29 | 5 | 12 | 19 |
| గురువారము | 23 | 30 | 6 | 13 | 20 |
| శుక్రవారము | 24 | 31 | 7 | 14 | |
| శనివారము | 25 | ఏప్రిల్ 1 | 8 | 15 | |

మార్చి 22 :– శక సంవత్సరం 1917 ప్రారంభం.

మార్చి 31 :– రేవతి కార్తె ప్రారంభం.

ఏప్రెల్ 1 :– ఉగాది – శ్రీ యువనామ సంవత్సర ప్రారంభం – వసంత నవరాత్రారంభం – దుకాణాలు – సంస్థలు, కర్మాగారాలు – సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

ఏప్రెల్ 9 :– శ్రీరామ నవమి.

ఏప్రెల్ 14 :– అశ్వనీ కార్తె రాక ఉ.11–లు

ఏప్రెల్ 15 :– చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

ఏప్రెల్ 20 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**26, 2, 9, 16 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర
# అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## ( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

మార్కాపురం　　　　3140, 3114,

## వైశ్యయాత్రీకులకు

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. ధాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.116/-లు చెల్లించిన వారికి సంవత్సరమునకు ఒకసారి ప్రసాదం పంపించబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు

యాత్రీకులకు యివ్వబడును.

3. వాసవీ భవన్, తిరుమల : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్థుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో మరియు పేరు శిలాఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. వాసరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. తిరుమల మేధరమెట్ట ప్రాంతంలో మనము కట్టుచున్న సత్రం దగ్గర కట్టిన షెడ్డులో తాత్కాలిక కార్యాలయం ప్రారంభించినాము.

4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూర్లు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణము చేసి క్రింద భాగములో వైశ్యులు కళ్యాణంలు చేసుకొనుటకు గాని, యితర సమావేశములు, శుభకార్యములు చేసుకొనుటకు గాని తయారుచేస్తూ, మొదటి అంతస్తులో భోజనహాలు నిర్మాణం చేసి, నిత్య భోజనములు, రెండవ అంతస్తు నుండి వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు తీర్మానించినాము. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళంలు సమర్పించకోర్తాము.

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. రూము సైజు 200 చ.అ. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్థులు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వ్రాయబడును. వీరికి

వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో-దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

M.Tech., ప్యాసు అయిన వారికి యీ సంవత్సరము రు.3500/-ల ప్రకారం ముగ్గురికి యివ్వబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు 1995లో స్వామి అనుగ్రహం మేరకు పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

-: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :-

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

## కాక భుశుండి పూర్వ జన్మ వృత్తాంతము.

"జప, తప, యజ్ఞ యాగాలు చేయడానికి ఫలితము రాముని పాద పద్మాల యందు భక్తి కలగడమే కదా! నాకు ఈ శరీరమందే రామభక్తి కలిగింది. కనుక నేను ఈ శరీరాన్ని ఎక్కువగా ప్రేమిస్తున్నాను. పురుగుల వలన పట్టు ఉత్పత్తి అవుతుంది. మనము ఆ బట్టలు ధరించి ఎంతో ఆనంది స్తున్నాము. అందువలన మనము ఆ పట్టు వస్త్రాలకు మూలకారణమైన ఆ పురుగులను ప్రేమించక తప్పదు. అలాగే నేను నా ఈ శరీరం పైన ఎక్కువ మక్కువ కలిగి వున్నాను. జీవులు కడతేరుటకు భగవంతుని భజింపక తప్పదు కదా!

నేను బ్రతకడం చావడం నా ఇష్టంలో వున్నాయి. శరీరం లేనిదే ఎవరూ ఏమీ చేయలేరు. అందువలన శరీరం వుండక తప్పదు. కనుక నేను కాకి రూపాన్ని వదలను. నేను సృష్టి ఆది నుంచి అనేక జన్మలు ఎత్తాను. కాని ఈ జన్మలో పొందినంత సుఖంగాని, శాంతిగాని మరి ఏ జన్మలోనూ పొందలేదు. నేను అనేక జన్మలెత్తినా, అవన్నీ నాకు గుర్తు వున్నాయి. నేను వాటిని మరువలేదు. మరణబాధ పొందలేదు. కొత్త జన్మలు ఎత్తడం అంటే, పాత వస్త్రం వదిలి పెట్టి కొత్త వస్త్రం ధరించి నట్లు వుంది.

శ్రీరామ దర్శనానంతరం మాయగాని, మోహంగాని నన్ను ఆవహింపలేదు. మీకు ఇప్పుడు నేను నా మొదటి జన్మ వృత్తాంతం చెబుతున్నాను. సావధానంగా వినండి. కలికాలం ప్రవేశించగానే మనుష్యులంతా అధర్మ పరాయణులయ్యారు. వేద పురాణాలకు విరుద్ధంగా నడవడం మొదలెట్టారు. ఆ రోజుల్లో నేను అయోధ్యలో శూద్రుడనై జన్మించి ఈశ్వరుణ్ణి ఆరాధిస్తూ వచ్చాను. ఇతర దేవుళ్లను స్మరించేవాణ్ణి కాదు. పైగా ద్వేషిస్తూ వచ్చాను నా మనస్సంతా కపటంతో నిండి వుండేది. నేను అయోధ్యా నగరంలో నివసిస్తూ వున్నా, దాని మహిమ ఎరుగను. అయోధ్యయందు జన్మించిన వాళ్లందరూ రామభక్తులని . ఇప్పుడు గ్రహించాను.

కృతయుగంలో జ్ఞానులైన మానవులు శ్రీ హరిని ధ్యానించి ముక్తి పొందేవాళ్లు. త్రేతాయుగంలో జప తపో యజ్ఞ యాగాదులతో తరిస్తారు. ద్వాపరంలో పూజలు చేసి కృతార్థులవుతారు. కలియుగంలో రామనామం జపించటంతో ముక్తిని పొందుతారు.

నేను చాలారోజులు అయోధ్యలో వున్నాను. అక్కడ ఒకప్పుడు గొప్ప కరువు వచ్చింది. ఆహారము దొరక్క కష్టాలుపడి ఉజ్జయినికి వెళ్లిపోయాను. అక్కడ కొంత కాలముండి, కొంత ధనం సంపాదించి పరమేశ్వరుని ఆరాధిస్తూ వచ్చాను. అక్కడ ఒక బ్రాహ్మణుడు శాస్త్రోక్తంగా ఈశ్వరుని ఆరాధిస్తూ వచ్చాడు. మా ఇద్దరికీ బాగా పరిచయం అయింది. మేము పరస్పరం ప్రేమతో మాట్లాడు కుంటూవచ్చాము. అతడు మంచి ప్రవర్తన గలవాడు. బుద్ధిమంతుడు. దయగల వాడు. ఇతర దేవతలను ద్వేషించేవాడు కాదు. నేను మాత్రం ఆయనకు కపట భావంతో సేవ చేస్తూ వచ్చాను. అయినా అతడు నన్ను కన్న పుత్రుని మాదిరి ప్రేమిస్తూ వచ్చాడు.

ఆయన నాకు శివ మంత్రం ఉప దేశించా ు. అప్పటి నుంచి నేను ఒక నియమం ో శివాలయానికి వెళ్లి శివ మంత్రాన్ని జపిస్తూ వచ్చాను. కాని నాకు గర్వం ఎక్కువయి పోయింది ఆడంబరం అతిశయించింది. అహంకారం మితి మీరింది. విష్ణు భక్తుల యెడ ద్వేషం కలిగింది. నా గురువు పైన కూడా నాకు గౌరవం తగ్గింది. ఆయన కన్పించినప్పు డల్లా ద్వేషం ఎక్కు వయింది. యోగ్యు డయిన ఆ బ్రాహ్మణుడు నా ఆలోచనలు గమనించి అనేక నీతులు చెప్పాడు. నన్ను మార్చడానికి ప్రయత్నం చేశాడు. కాని ఆయన బోధలు నా చెవి దూరలేదు. దుష్ట బుద్ధి కలవాళ్లకు మంచి మాటలు చెవి కెక్కవు గదా!

ఆ బ్రాహ్మణుడు ఒకనాడు నన్ను పిల్చి "నాయనా శివుని ఆరాధించడ మంటే శ్రీ రాముని ఆరాధించడమే! శివ సమారాధనకు తగిన ఫలము శ్రీ రాముని యందు భక్తి అతిశయించడమే! బ్రహ్మ రుద్రాదులు కూడా శ్రీ రాముణ్ణి పూజిస్తారు. నువ్వు పెద్దలను తృణీకరించ వద్దు. నీ ప్రవర్తన చక్క బరచుకో.!! అని హెచ్చరించాడు. కాని ఆయన మంచి మాటలన్నీ నేను పెడచెవిన బెట్టాను. క్రమంగా అహంకారం పెరిగి నాకు గురువు పట్ల నిరాదరణ నిర్లక్షము ఎక్కువ అయ్యాయి.

ఒకసారి నేను శివాలయంలో కూర్చొని శివ నామం జపిస్తూ వున్నాను. ఆదే సమయంలో మా గురువుగారు అక్కడకు వచ్చారు. ఆయన్ను చూసి కూడా దురహంకారంతో నేను లేచి నమస్కరింపలేదు. గురువుగారు దయా మయుడు కనుకనే నా తప్పును క్షమించి వూరకున్నాడు. కాని పరమేశ్వరుడు నా అహంకారాన్ని సహింప జాలక నా పైన ఆగ్రహం చెందాడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది.

"ఓరీ మూర్ఖుడా! గురువును అవమా నించిన వాళ్లు యుగ యుగాల పర్యంత ము నరకంలో పడి నా నా బాధలు అను భవింపక తప్పదు. వెయ్యి జన్మలు ఎత్తక తప్పదు. నువ్వు నీ గురువును చూసి కూడా కొండ చిలువ మాదిరి కదలక, మెదలక పడివున్నావు. కనుక నువ్వు సర్పానివై ఏ దైనా పెద్ద చెట్టు తొర్రలో పడివుందువు గాక."

భయంకరమైన ఆ ఈశ్వర శాపాన్ని విని గురువుగారు నాపైన మిక్కిలి జాలిపడి హా హాకారం చేశారు. నేను భయంతో గజ గజ వణికి పోతూ వుండడం చూసి ఆయన మనస్సులో గొప్ప సంతోషం కలిగింది.

ప్రేమతో ఈశ్వరుని ఎదుట సాష్టాంగ పడి చేతులు జోడించి గద్గద స్వర ప్రార్థించాడు.

1) నమా మీశ మీశాన నిర్వాణరూపం,
విభుం వ్యాపకం బ్రహ్మ వేదస్వరూపమ్
నిజం నిర్గుణం నిర్వికల్పం నిరీహమ్,
చిదాకాశ మాకాశవాసం భజేహమ్.

ఓ మోక్షస్వరూపా! సర్వ వ్యాపకా! బ్రహ్మణ్యా! వేద స్వరూపా! ఈశాన్య దిక్ప్రభూ, సర్వేశ్వరా! శంకరా! నా నమో వాకాలు. నీవు మాయారహితుడవు. గుణ భేదరహితుడవు. ఇచ్ఛా శూన్యుడవు. ఆకాశ స్వరూపా! గగనమే నీవు ధరించే వస్త్రము. దిగంబరా! నిన్నే భజిస్తున్నాను.

2) నిరాకార మోంకారమూలం తురీయమ్
గిరాజ్ఞాన గోతీత మీశం గిరీశమ్,
కరాలం మహాకాల కాలం కృపాలమ్,
గుణాగారసంసార పారం నతోఽహమ్.

నిరాకార, ఓంకారమూల, త్రిగుణాతీత! నీవు తురీయావస్థలోనే గోచరుడవు. మహాకాలునికి సైతము కాలుడవు. కృపాళుడవు. సంసారము నుండి తరింపజేసేవాడవు పరమేశ్వరా, నీకు నమస్కారాలు.

3) తుషారాద్రి సంకాశ గౌరం గభీరం,
మనో భూత కోటి ప్రభా శ్రీ శరీరమ్.
స్ఫురన్మౌలి కల్లోలినీ చారు గంగా,
లసద్భాల బాలేందు కంఠే భుజంగా.

హిమాచలముతో సమానమైన గౌర వర్ణముగల గంభీర శరీరంతో, కోటి మన్మధుల కాంతితో శోభిల్లుతూ శిరముపైన గంగ విరాజిల్లు చుండగా లలాటాన చంద్రరేఖ, కంఠమందు సర్ప హారాలు శోభిల్లు తున్నాయి.

4) చలత్కుండలం భ్రూసునేత్రం విశాలం
ప్రసన్నాననం నీలకంఠం దయాలమ్.
మృగాధీశ చర్మాంబరం ముండమాలం
ప్రియం శంకరం సర్వనాథం భజామి.

కర్ణకుండల భూషితా, సుందర భృకుటీ, విశాలనేత్రా, ప్రసన్నముఖా! నీలకంఠా, దయాళూ, గజచర్మాంబరా! భూతేశా, కపాలమాలాధరా, శ్రీ శంకరా. నిన్నే భజిస్తాను.

5) ప్రచండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం
అఖండం అజం భాను కోటి ప్రకాశమ్.
త్రయః శూల నిర్మూలనమ్ శూలపాణిం
భజేహమ్ భవానీ పతిం భావ గమ్యమ్.

నీవు ప్రచండ రుద్ర రూపుడవు. శ్రేష్ఠ తేజస్సంపన్నుడవు. పరమేశ్వరా! అఖండ స్వరూపుడవు. జన్మ బంధములేని వాడః కోటి సూర్యులతో సమానమైన ప్రకాశముగల వాడవు. దుఃఖోపశాంతి గూర్చువాడవు. త్రిశూలధారివి. భవానీ పతీ, నిన్ను భజిస్తున్నాను.

6) కళాతీత కళ్యాణ కల్పాంత కారీ,
సదా సజ్జనానంద దాతా పురారీ.
చిదానంద సందోహ మోహాపహారీ,
ప్రసీద ప్రసీద ప్రభో మన్మ ధారీ.

నీవు కళా తీతుడవు. కళ్యాణ స్వరూపుడవు. కల్పాంత కారివి. సజ్జనులకు ఆనందము కూర్చువాడవు. సచ్చిదానంద ఘనుడవు. మోహమును హరించువాడవు. మన్మధ శత్రువగు నీవు

ప్రసన్నుడవు కమ్ము.

7) నయావద్ ఉమానాధ పాదార విందం
భజంతీహ లోకేపరే వానరాణామ్.
న తావ త్సుఖం శాంతి సంతాపనాశం,
ప్రసీదప్రభో పర్వ భూతాధివాసమ్.

ఓ సాంబశివా! నీ చరణకమలాలు భజింప కున్న ఇహపర లోకాలందు మానవునకు శాంతి లభించదు. సమస్త జీవులలో అంతర్యామివై వెలుగు ప్రభూ, నీవు నాకు ప్రసన్నుడవు కమ్ము.

8) న జానామి యోగం జపం
నై వపూజాం,
నతోఽహం సదా సర్వదా శంభు
తుభ్యమ్
జరాజన్మ దుఃఖౌఘతా తాప్యమానం,
ప్రభో పాహి ఆ పన్నమా మీశంభో.

నేను యోగాలు, జపాలు చేయలేదు. శంభో, సదా నీకు నమస్కారం చేయుచున్నాను. ప్రభూ, బాల్యాది చతుర్దశలు బాల్య, యౌవన, కౌమార, వార్ధక్య, మృత్యు దుఃఖాలు నన్ను దహిస్తూ వున్నాయి. రక్షించు ఈశ్వరా! నీకు నమో వాకాలు.

రుద్రాష్టక మిదం ప్రోక్తం విప్రేణ
హరతోషయే. యే పఠంతి నరా భక్త్యాతే
షాం శంభుః ప్రసీదతి.

శంకరుని ప్రసన్నత కొరకై రుద్రాష్టక మను ఈస్తుతి సజ్జనులకై చెప్పబడినది. భక్తితో భజించు వానికి శంకర సాక్షాత్కార మగును. ఈస్తుతి చేత మోదమంది శివుడు గురువు పై కటాక్ష వీక్షణాన్ని ప్రసాదించాడు.

"మోక్షస్వరూపుడవైన ఓ పరమేశ్వరా, వీడు అమాయకుడు. అజ్ఞాని. మూర్ఖుడు. తెలియక తప్పు చేశాడు. వీణ్ణి క్షమించి రక్షించండి." అని ప్రార్థించిన బ్రాహ్మణుని పలుకులు విని పరమేశ్వరుడు ఈ విధంగా చెప్పాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా, ఇతని అపరాధానికి నేను కోపించి ఇతణ్ణి శపించాను. నీ ప్రార్థన వినగానే నాకు నీ పై దయ కలుగుతూ వుంది. కాని ఇతడు చేసినది క్షమించరాని అపరాధం. నా శాపం వృధాపోదు. ఇతడు. వెయ్యి జన్మలు ఎత్తక తప్పదు. అయినా కూడా ఇతడికి ప్రతి జన్మయందూ పూర్వ జన్మ స్మృతి వుంటుంది. ఏ జన్మలోనూ క్లేశము కలుగదు. లోకంలో ఎక్కడికైననూ నిరాటంకంగా వెళ్లగలడు. ఎంతటి సాహస కార్యాలయినా చేయగలడు. జ్ఞానులలో ఉత్త మోత్తమస్థానము అందుకోగలడు."

(ఇంకా ఉంది)

## కదిరి ఆర్యవైశ్య సంఘానికి నూతన కార్యవర్గము

అనంతపురం జిల్లాకు చెందిన పై ఆర్యవైశ్య సంఘం సర్వసభ్య సమావేశము 7.3.1995వ తేదీన జరుగ క్రింది వారలు నూతన కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. గౌరవాధ్యక్షులు శ్రీ మట్టా రామనాధయ్య శ్రేష్ఠి, అధ్యక్షులు శ్రీ పచ్చిపులుసు అక్కులప్ప శ్రేష్ఠి, ఉపాధ్యక్షులు శ్రీ ముద్దరరాజ, శ్రీ కోటా కృష్ణమూర్తి, కార్యదర్శి శ్రీ పడుచూరు సుబ్బరాజు, సంయుక్త కార్యదర్శులు శ్రీ వంకాయల కృష్ణమూర్తి, శ్రీ తబ్జూలు గౌరీ శంకర్, శ్రీ బొగ్గరపు వెంకట రమణప్ప, కోశాధికారి శ్రీ యినిమిడి శెట్టి కేశవనాథ్. 1.4.1995 నుండి పై వారు తమ పదవులను నిర్వహిస్తారు.

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాలు ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య.

## కేసెట్ల పంపిణీ – ప్రచారం వివరాలు

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీదేవి సుప్రభాతం, సహస్రోత్తర నామములను కమ్మగా, ఇంపుగా కేసెట్ చేయించి, కడప ప్రధాన కార్యస్థానంగా గల పై సమాఖ్య 13.2.1995వ తేదీన ఇందు కొఱకై విజయవాడలో ఏర్పాటు చేయబడిన కార్యక్రమములో శాసన సభ్యులు శ్రీ పందారం వెంటయ్య గారిచే విడుదల చేయించిన విషయాన్ని ఈ పత్రికలో చదివే ఉన్నారు.

ఈ కేసెట్ల ప్రచారం, పంపిణీ ఎక్కువగా జరిపి, ఈ సుప్రభాతశ్రవణము, సహస్రనామ సంస్మరణ భాగ్యాన్ని మన వైశ్యసోదరులలో వీలైనంత ఎక్కువ మందికి కలిగించుటకు గానూ ఈ పై సమాఖ్య వారు క్రింది విధమగు బహుమతులను ప్రకటించారు.

500 కేసెట్లు అమ్మిన వారికి – ఒక స్వర్ణపతకము

250 కేసెట్లు అమ్మిన వారికి – ఒక స్వర్ణపతకము (చిన్నది)

100 కేసెట్లు అమ్మిన వారికి – ఒక రజత పతకము.

ఈ పోటీ కార్యక్రమములో వైశ్య సోదరులే కాదు వైశ్యేతరులు కూడ పాల్గొనవచ్చు.

పై సమాఖ్యకు పూర్తిగా రూపాయలను చెల్లించి కేసెట్లను తీసుకొన్న వారే పై విధమగు బహుమతులను పొందుటకు అర్హులు.

31.7.1995 వరకూ ఈ బహుమతుల కార్యక్రమం ఉంటుంది.

పతకములను గూడ ఇందు కొఱకు ఏర్పాటు చేయబడే ఒక పెద్ద సభలో ఇస్తారు.

రూపాయలను శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి పేర కడపలో నగదు అగునట్లుగా పంపాలి. చెక్కులు తీసుకోరు.

అధిక సంఖ్యలో ఈ కార్యక్రమములో పాల్గొని, వీలైనంత ఎక్కువ మందికి మాతృశ్రీ సుప్రభాత శ్రవణాన్నీ, సహస్రోత్తర నామసంస్మరణ భాగ్యాన్నీ కల్పించుటలో కృషి చేయవలసిందిగా కోరుచున్నాము.

వంద లేక అంతకు పైబడి కేసెట్లను కొనువారు కేసెట్ 1కి రూ॥25/–ల ప్రకారం మొత్తాన్ని పంపాలి. 100 కు తక్కువ కొను వారు కేసెట్ 1కి రూ॥ 30/–ల చొప్పున పంపాలి. 25 కేసెట్లకు తక్కువ ఆర్డరు పంపిన తీసుకోబడదు.

కర్నూలు జిల్లా మానెపల్లె ఆర్యవైశ్య సంఘము వారు ఇప్పటికే 350 కేసెట్లను

అమ్మి స్వర్ణ పతకాన్ని కైవసము చేసు కొనుటకు తయారగు చున్నారు.

గుంటూరు, పిడుగురాళ్ళ, రెంట చింతల, సికింద్రాబాద్, ఆదోని, రాజంపేట, అనకాపల్లె, బేతంచర్లలలోని శ్రీ వాసవీ దేవ్యాలయసంఘాల వారు, భీమవరం ఆర్య వైశ్యయువజన సంఘము వారు, శ్రీ యస్.పి. మును స్వామి శ్రేష్ఠి పుంగనూరు, శ్రీధారా రామనరసింహ్మ, కొత్తగూడెం, శ్రీ సి.వి. సుబ్బరావు ప్రొద్దుటూరు గారలూ ఇప్పటికే రజత పతక స్వీకరణకు అర్హులయ్యారు. ప్రొద్దుటూరు ఆర్య వైశ్య సభ వారు ఇప్పటికి ఒక వంద యాభై కేసెట్లను అమ్మి, రజతపతకము ను పొందుటకు అర్హులయ్యారు.

త్వరపడండి. పై వాటిలో ఏదో ఒక బహుమతిని అందుకొనుటకు ఎందుకు ప్రయత్నించ కూడదో మీరూ ఆలోచించండి.

శ్రీ జూటూరు రమణయ్య
కోశాధికారి

వాసవీ యాడ్స్ కడప సౌజన్యంతో

## ఎంతయో బాగుంది

ఆర్యా! మన వైశ్యప్రబోధినిలో శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ గారు రాసిన "వాస్తుశాస్త్రము" అను వ్యాసం ఎంతయో బాగుంది.

పి. రోషారావు
28.2.1995 విజయవాడ

## ఉత్తమ బాలనటుడు "చి॥ షణ్ముగ కుమార్"



తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర నాట్య కళా పరిషత్ వారు గత ఆగస్టునెల 1వ తేదీ నుండి 7వ తేదీ వరకూ రాష్ట్రస్థాయి పౌరాణిక నాటక పోటీలను నిర్వహించారు. ఈపోటీలలో రాజంపేట శ్రీ రాఘవకళా నికేతన్ వారు ప్రదర్శించిన "స్వామి అయ్యప్ప" నాటకములో అయ్యప్ప పాత్రను ధరించి, ప్రశంసాపాత్రంగా నటించిన చిరంజీవి షణ్ముగకుమార్ ఉత్తమ బాల నటుడిగా బహుమతిని అందుకొన్నారు. చిరంజీవి షణ్ముగకుమార్ కడప జిల్లా రాజంపేట వైశ్య ప్రముఖులు, అవిశ్రాంత కార్యకర్త శ్రీ కర్నాటకం సుబ్రమణ్యంగారి కుమారులు. కుమార్ రాజంపేటలోని భారతీయ విద్యానికేతన్ లో పదవతరగతి చదువు చున్నాడు. వీరి తండ్రి శ్రీ సుబ్రమణ్యం గారు రాజంపేట ఆర్య వైశ్య సంఘానికి వెన్నెముక వంటివారు. ఈ బాలనటుడు నటించిన నాటకానికి ఉత్తమ ద్వితీయ బహుమతిగా రూ॥ 5500/-ల నగదు మరో షీల్డుతోబాటు ఐదు ప్రత్యేక బహుమతులు గూడ లభించాయి.




## శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు ఆర్య వైశ్యధర్మ సంస్థల సమాఖ్య ఆంధ్ర ప్రదేశ్

**రిజిష్టర్డు నెం. 67/1990**

**వైశ్యప్రబోధిని కార్యాలయం, జయనగర్ కాలనీ, కడప – 516 002**

---

### దర్శి చంచయ్య గుప్త అవార్డు

కీ॥శే॥ దర్శి చంచయ్య గుప్తగారు. వైశ్యులు, ప్రపంచములోనే తొలి విప్లవపక్షమైన గదర్ పార్టీ భారాన్ని కూడ భుజాన వేసుకొని కొంత కాలమ నడిపినవారు. ఈ పత్రికలో గత రెండు సంవత్సరాలుగా ప్రచురిత మగుచున్న నేను, నాదేశం శ్రీ చంచయ్య గారి స్వీయరచన. స్వీయ చరిత్ర. 13.2.1995వ తేదీన విజయవాడలో జరిగిన ఒక పెద్ద కార్యక్రమములో పై సమాఖ్య ఏర్పరచిన శ్రీ దర్శి చంచయ్య గుప్తఅవార్డును మొదటిసారిగా స్వాతంత్ర్య సమరయోధులూ, తెలంగాణా విమోచన ఉద్యమములో ధీరోదాత్తంగా పాల్గొన్న శ్రీ కె.సి. గుప్త గారికి ఈ సమాఖ్య అధ్యక్షులు శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఇచ్చిన విషయాన్ని ఈ పత్రికలో చదివే ఉన్నారు. మరుసంవత్సరము ఈ అవార్డును ఇర్వురికి ఇవ్వాలని ఈసమాఖ్య నిర్ణయించింది. ఒకటి స్వాతంత్ర్యసమర యోధునికి, రెండవది సాహిత్యములో పరిశ్రమించిన వారికి. ఈ సంవత్సరం ఈ అవార్డుకు ఈ సమాఖ్య అధ్యక్షులు "ప్రజాబంధు", "దానశీల" శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు తమ శ్రీ కామిశెట్టి సుబ్బరావు, శ్రీమతి చెన్నమ్మ ట్రస్టు నుండీ విరాళంగా రూ॥ 1500/–లు ఇచ్చి సహకరించారు. ఎవరైతే 1500/–లు విరాళంగా ఇస్తారో వారి పేరు మీద వారి అమృత హస్తాలతో, ఈ అవార్డు ను పైసమాఖ్య ఎన్నిక చేసిన వారికి ఇవ్వవచ్చు. ఆసక్తిగల ఉదార హృదయులను ముందుకు రమ్మని ఆహ్వానిస్తున్నాము.

### జమిలి నమ్మాళ్వార్ అవార్డు

పండితులు, సాహిత్యవేత్త కీ॥శే॥ శ్రీ జమిలి నమ్మాళ్వార్ గారి పేర కూడ ఒక అవార్డును మరు సంవత్సరము నుండీ ఇవ్వాలని పై సమాఖ్య నిర్ణయించింది. ఈ అవార్డుకు కూడ విలువ రూ॥ 1500/ లే. ఈ అవార్డును కూడ దాతే స్వయంగా తమ అమృత హస్తాలతో ఎన్నికైన వారికి ప్రదానం చేయవచ్చు. ఆసక్తి గల వైశ్య సోదరులను ఇందుకు కూడ సహకరించ మని కోరుచున్నాము.

## స్వర్ణపథక బహూకరణ

మన రాష్ట్రములో ఇప్పుడున్న వివిధ విశ్వవిద్యాలయాలు ప్రతి యేటా నిర్వహిస్తున్న స్నాతక (బి.ఎ.) స్నాతకోత్తర(పి.జి.కోర్సులో) పరీక్షలలో విశ్వవిద్యాలయ ప్రథములుగానో, ఆయా పరీక్షల్లో కూర్చొన్న వైశ్యవిద్యార్థినీ విద్యార్థులెల్లరిలో అత్యధిక గుణములు (మార్కులు) గడించిన వారి ప్రతిభను దర్పణం పట్టి లోకానికి చూపి మరింతగా విద్యాభ్యాసానికి ఉత్సాహపరిచే రాష్ట్రస్థాయి వైశ్యసంస్థ ఇప్పుడు ఏదీలేదు. ఈ లోపాన్ని గుర్తించిన పై సమాఖ్య మరు సంవత్సరము నుండీ పైన తెల్పిన ప్రతిభగల వైశ్య విద్యార్థినీ, విద్యార్థులకు స్వర్ణపతకములను బహూకరించాలని కూడ ఈ సమాఖ్య ఆధ్యక్షులు తలంచారు. స్వర్ణ పథక విలువ రూ॥1000/-లుగా ప్రకటించగా 13.2.1995న జరిగిన కేసెట్ విడుదల సభలో విజయవాడ వాస్తవ్యులు డాక్టర్ లోకనాథ రావు గారు రూ॥ 1116/-లుగా ఇస్తానని తమంత తామే వేదిక ముందుకు వచ్చి ప్రకటించారు . ఆసక్తిగలిగిన ఉదార హృదయులగు వైశ్య సోదరులను ఈ పతక బహూకరణ కార్యక్రమానికి దాతలుగా సహకరించ కోరుచున్నాము.

ఈ కార్య క్రమములకు విరాళాలు ఇవ్వాలను కొన్న దాతలు డి.డి.ద్వారా కానీ, యం.ఓ. ద్వారా కానీ పై అడ్రసుకు పూర్తి వివరాలతో పంపగోరు చున్నాము.

ఆశయాన్ని గుర్తించి, సహకరించ గలిగి నపుడే మీరు ఇచ్చే విరాళాలకు సార్థకత లభించగలదని గుర్తించ కోరుచున్నాము.

'ప్రజాబంధు', 'దానశీల'
శ్రీ కామిశెట్టి సుబ్బరావు, ఆధ్యక్షులు
'సంఘోద్ధారకు', 'వైశ్యభూషణ'
పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి
ప్రధానకార్యదర్శులు.

(వాసవీ గ్రాఫిక్స్, కడప
సౌజన్యముతో)

## రాజంపేట, శ్రీ వాసవీ దేవ్యాలయ శత సంవత్సరోత్సవం

1992 లో నిర్మించబడిన కడప జిల్లా రాజంపేట శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయము 2001కి నూరు సంవత్సరాలు పూర్తి చేసుకోబోయే సందర్భాన్ని పురస్కరించు కొని సదరు దేవ్యాలయ నిర్వాహకులు రాజంపేట ఆర్యవైశ్యసంఘము వారు 19.2.1995 నుండి 25.2.1995 వరకు శత వార్షికోత్సవాన్ని జరిపించారు.

## వివాహం

పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండ పుర ప్రముఖులు శ్రీ నూలి వెంకటసోమరాజు గారి కుమార్తె చి॥ వాసవి, బి.కాం., గారి వివాహం, చిలకలూరిపేట కూనిశెట్టి పూర్ణచంద్రరావు గారి కుమారులు చి॥ ఓబయ్య గుప్త యం.బి.ఎ., ఎల్.ఎల్.బి., గారితో 16.3.1995వ తేదీన పెనుగొండలోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయ ప్రాంగణములో వైభవంగా జరిగింది.

## ఇది మీకు తెలుసా?

## శ్రీ వాసవీదేవ్యాలయాల అర్చకులకూ, నిర్వాహకులకూ శిక్షణా తరగతులు

కడప ప్రధాన కార్య స్థానంగా గల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలూ, ఆర్యవైశ్యధర్మ సంస్థల సమాఖ్య ఆంధ్రప్రదేశ్ వారు మే నెల చివరి వారములోనో, జూన్ నెల మొదట వారములో మన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రములో గల శ్రీ వాసవీ దేవ్యాలయాల అర్చకులకూ, నిర్వాహకులకూ శ్రీశైల మహాక్షేత్రములో ఐదు రోజులు శిక్షణా తరగతులు ఏర్పాటు చేస్తున్నారనీ, ఇలా శిక్షణా తరగతులు ఏర్పాటు చేయుటలో రాష్ట్రమంతటా గల శ్రీ వాసవీ దేవ్యాలయాలలో ఒకే విధముగా ఆరాధనా క్రమము ఉండాలన్నదే ఇందలి ప్రధానోద్దేశ్యమనీ సదరు సమాఖ్య అధ్యక్షులు, 'ప్రజాబంధు', 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఈ సందర్భాన్ని పురస్కరించుకొని విడుదల చేసిన ఒక పత్రికా ప్రకటనలో పేర్కొన్నారు.

ఈ సదవకాశాన్ని జారవిడుచుకోకుండా, తరగతులకు విధిగా హాజరు కావడము రాష్ట్రములోని శ్రీ వాసవీ దేవ్యాలయాలోని అర్చకులకూ, వాసవీ ఆలయాల నిర్వాహకులకూ విధ్యుక్త కర్తవ్యము.

## నూనెపల్లెలో మాతృశ్రీ ప్రతిష్ఠ

కర్నూలు జిల్లా నంద్యాల పట్టణములో అంతర్భాగంగా ఉన్న నూనెపల్లెలోని ద్వ్యుత్తరశత గోత్రీయులు కన్నుల పండువుగా నిర్మించుకొన్న మాతృశ్రీ ఆలయములో 19.2.1995వ తేదీన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి ప్రతిష్ఠ జరిగింది. 15.2.1995తో ఆరంభమైన ఈ ప్రతిష్ఠా కార్యక్రమం పంచాహ్నిక దీక్షతో సాగి 19.2.1995వ తేదీన జరిగిన మాతృశ్రీ ప్రతిష్ఠా కార్యక్రమముతో ముగిసింది.

కడప ప్రధాన కార్యస్థానంగాగల శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య ఆంధ్రప్రదేశ్ ఇచ్చిన సలహాల ప్రకారము కేవలము శ్రీ వాసవీదేవికి మాత్రమే గుడికట్టి అందులో అమ్మను మాత్రమే ప్రతిష్ఠించడమూ, 1985లో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభచే ఆధికారికముగా ప్రకటించబడి, పై సమాఖ్య యధాతథంగా స్వీకరించిన ప్రామాణిక యంత్రమునే ప్రతిష్ఠించడమూ ఈ ప్రతిష్ఠా కార్య క్రమములో ప్రత్యేకంగా గమనించి, గుర్తుంచుకోవలసిన విషయాలు.

ఆలయ ప్రాంగణములోనే సువిశాలమైన శ్రీ వాసవీ ఆర్యవైశ్య కల్యాణ మంటపాన్ని కూడ ఎంతో అందంగా నిర్మించి, నూనెపల్లెలోని వైశ్య సోదరులకు వివాహ విషయంగా మంచి సౌకర్యాన్ని కూడ నూనెపల్లె ఆర్య వైశ్య సంఘము వారు కల్పించడం ముదావహం.

## కడప జిల్లా రథ సారథి గంగగోపాల్

29.1.1995వ తేదీన ప్రొద్దుటూరులో జరిగిన కడప జిల్లా ఆర్యవైశ్య సంఘసర్వసభ్య సమావేశము, ఎన్నికలలో ప్రొద్దుటూరు పుర ప్రముఖులు, యువకులు శ్రీ అంబటి గంగగోపాల్ గారు సదరు జిల్లా సంఘానికి అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

## రాజంపేట ఆర్య వైశ్య యువజన సంఘానికి నూతన కార్యవర్గం

పై యువజన సంఘం సర్వ సభ్య సమావేశం ఈమధ్యజరుగ క్రింది వారలు నూతన కార్య వర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. అధ్యక్షులు శ్రీ యేల్చూరి అశోక్ కుమార్, ఉపాధ్యక్షులు శ్రీ దోరడ్ల రామమోహన్, కార్యదర్శి శ్రీ నటకుల రామకృష్ణ, సహాయ కార్యదర్శి శ్రీ బవిరి శెట్టి శ్రీధర్, కోశాధికారి శ్రీ చింతకుంట సుబ్రమణ్యం.

## వివాహం

చిత్తూరు జిల్లా పుంగనూరు వైశ్య ప్రముఖులు శ్రీ యస్.పి. మునిస్వామి శ్రేష్ఠి గారి కుమారులు చి॥ బాలాజి, బి.ఇ (మెకా) గారి వివాహం, బెంగులూరు శ్రీ సి.ఆర్. ఆనంద్ గారి కుమార్తె చి॥ సురేఖ బి.కాం., గారితో 3.3.1995వ తేదీన బెంగులూరు లోని వి.ఆర్.కె. కల్యాణ మంటపంలో వైభవంగా జరిగింది.



# డాక్టర్ గ్రంధే రఘురామగుప్తగారి వివరాలు



డా. జి.వెంకట ప్రసాద్ | డా. గ్రంధే రఘురామ గుప్త

| | | | |
|---|---|---|---|
| తిరుపతి | 6.4.95 | గురువారము | గౌతమ్ లాడ్జి, బస్టాండు వద్ద |
| నెల్లూరు | 7.4.95 | శుక్రవారము | హోటల్ సింహపురి |
| ఒంగోలు | 8.4.95 | శనివారము | హోటల్ అభిలాష్ |
| విజయవాడ | 9.4.95 | ఆదివారము | హోటల్ అభిలాష్, గవర్నర్ పేట |
| భీమవరం | 10.4.95 | సోమవారము | హోటల్ రత్న |
| బందర్ | 11.4.95 | మంగళవారము | అరుణ లాడ్జి |
| రాజమండ్రి | 12.4.95 | బుధవారము | హోటల్ చంద్రలోక్, సాయి క్రిష్ణ థియేటర్ రోడ్ |
| అనకాపల్లి | 13.4.95 | గురువారము | శ్రీనివాసలాడ్జి, సత్యనారాయణ టాకీస్ రోడ్ |
| విశాఖ | 14.4.95 | శుక్రవారము | హోటల్ మేఘాలయ, ఆర్.టి.సి. బస్టాండు వద్ద |
| విజయనగరం | 15.4.95 | శనివారము | పూర్ణిమా రెస్టారెంట్ & లాడ్జ్ |
| ఖమ్మం | 17.4.95 | సోమవారము | హోటల్ కిన్నెర |
| హనుమకొండ | 18.4.95 | మంగళవారము | హోటల్ రాధిక |
| సికిందరాబాద్ | 28.4.95 | శుక్రవారము | సన్ లాడ్జి, స్టేషన్ రోడ్ |
| మహబూబ్‌నగర్ | 29.4.95 | శనివారము | అవంతికా లాడ్జి |
| కర్నూలు | 30.4.95 | ఆదివారము | చంద్రాలాడ్జి, పార్క్ రోడ్ |
| ఆదోని | 1.5.95 | సోమవారము | న్యూ శ్రీనివాస భవన్, పాత బస్‌స్టాండు వద్ద |
| అనంతపురం | 2.5.95 | మంగళవారము | భీమా లాడ్జి |

క్యాంప్ ఉదయము 9 గం.ల నుండి సాయంకాలము 5 గం.ల వరకు. పరీక్ష రుసుము రూ.25/-లు. పూర్తి పైకము చెల్లించి ఔషధము పొందవచ్చును. లేక రూ.100/-లు అడ్వాన్సుగ చెల్లించిన తక్కిన పైకమునకు మందులు వి.పి.గ పంపెదము. వివరములకై రూ1/- బిళ్ళ అతికించిన కవరు మీ అడ్రస్‌తో మాకు పంపండి. కడుపు నొప్పులు, అల్సర్లు, మొలలు, సోరియాసిస్, బొల్లి, కీళ్ళవాతము, సమస్త చర్మ వ్యాధులు, ఆస్తమా, మొదలగు వ్యాధులకు ఔషధము తీయబడును.

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా.
S.T.D. No.: 08596 ఫోన్ : 2017

మేనేజరు
అమరజ్యోతి ప్రొడక్ట్స్





## గ్యాస్ట్రైటిస్ వ్యాధి బాగైనది

ఆయుర్వేద మార్తాండ శ్రీ గ్రంథే రఘురామగుప్త మరియు డా॥ వెంకట ప్రసాద్ గార్లకు ఆర్యులారా! నమస్కారములు. నేను ఒక సంవత్సరముగ గ్యాస్ట్రైటిస్ వ్యాధితో బాధపడుచు, ఎన్ని మందులు తీసికొన్నను, ప్రయోజనము లేకపోయినది. కడుపులో విపరీతమైన గ్యాస్ ఏర్పడుచుండినది. మీ ఔషధము 3 మాసములు సేవించితిని. నాకు చక్కటి ఆరోగ్యము కలిగినది.

ఇందిరాగాంధి నగర్ — శరణం సాంబశివరావ్
గుంటూరు. — 21వ లైను (నల్ల చెఱువు)

## ఆర్థరైటిస్ (కీళ్ళవాతము) బాగైనది

వైద్య మార్తాండ శ్రీ గ్రంథే రఘురామగుప్త గారికి, ఆర్యా: నేను కీళ్ళవాతముతో (Arthritis) బాధపడుచుంటిని. నా మోకాళ్ళు, చీలమండలు ఒక నెలరోజులుగ వంగకపోవుటయేగాక నొప్పి తీవ్రముగ నుండినది. కాని, ఒక రిక్షా ఏర్పాటు చేసికొంటిని. కుడిచేతి ఉంగరపు వ్రేలు కూడ వంగలేదు. మీ ఔషధము 1 1/2 రోజు సేవించినంతటనే నాకు కీళ్ళవాతమునుండి పూర్తి విముక్తి కలిగినది. ఆయుర్వేద వైద్యశాస్త్రములో మీరు మహా దక్షులు. మీ వద్దనున్న రోగుల Filesను చూచితిని. రకరకముల వ్యాధుల నివారించుటలో మీ ప్రజ్ఞ అపారము.

మార్కాపురం — డాక్టర్ కె.చెన్నయ్య, M B B.S.,
6.11.76 — సివిల్ అసిస్టెంట్ సర్జన్

## సోరియాసిస్ (మచ్చలపై పొట్టు రాలే వ్యాధి) బాగైనది

నేను మార్కాపురంలో గవర్నమెంట్ డాక్టర్‌గా నున్నపుడు యమ్.కుప్పుస్వామియను బెంగ్లూరు పేషంటు తన చర్మవ్యాధిని బాగుచేసికొనుటకు వచ్చెను. అతనిని పరీక్షించి అతడు సోరియాసిస్ వ్యాధి పీడితుడని నిర్ణయించితిని. తాను అనేక వత్సరములుగ ఆ వ్యాధి పీడితుడని, బెంగ్లూరులో అనేక చర్మవ్యాధి నిపుణులచే చికిత్స చేయించు కొన్నను వ్యాధి బాగు కాలేదని అతడు చెప్పెను. సోరియాసిస్ వ్యాధికి సంబంధించి యిది సహజమే. మీరు సిద్ధ ఆయుర్వేద వైద్యులు. 5 నెలలు మందిచ్చినంతనే మొత్తం వ్యాధి నయమగుట చూచి చాల ఆశ్చర్యపడితిని.

కనిగిరి, ప్రకాశం జిల్లా. — డాక్టర్ బి.రామసుబ్బారెడ్డి, M.B.B.S.,
18.6.80 — డిప్యూటి సివిల్ సర్జన్

## బొల్లి, మూర్ఛ పూర్తిగ బాగైనవి

ప్రియమైన రఘురామగుప్త గారు! పరీక్షకై మీరు పంపిన ఔషధములు బొల్లి, మూర్ఛ రోగులపై ప్రయోగించితిని. అవి చాల బాగుగ పనిచేసినవి. అప్పటి నుండి వ్యాధులు లేవు.

ఇచ్ఛాపురం, — డాక్టర్ వి.కామేశ్వరరావ్
ప్రకాశం జిల్లా. — జిల్లా మెడికల్ & హెల్త్ ఆఫీసర్

## గ్యాస్ట్రైటిస్ వ్యాధి నయమైనది

ఆయుర్వేద మార్తాండ శ్రీ గ్రంథే రఘురామగుప్త గారికి, ఆర్యా! నేను గత 2 సంవత్సరములుగ తీవ్రమైన గ్యాస్ట్రిక్ అల్సర్‌తో బాధపడుచుంటిని. త్రేపులు, కడుపులో బరువుగ నుండుట, మంట, ప్రక్క ఎముకలలో నొప్పి, విరేచన బద్ధములతో బాధపడితిని. మీతో కాంట్రాక్టు ఏర్పాటు చేసికొని, 4 నెలలు మీరిచ్చిన మందు సేవించితిని. నా బాధలన్నీ పోయినవి. మీలోని సిద్ధ వైద్యశక్తికి నమస్కారములు!

8-1-103, యం.జి. రోడ్, విజయనగరం. — ఉదత్తు కాశీ విశ్వనాథం,
6.6.94. ఫోన్స్ : 2227, 2279, 4194, 2730 — ఉదత్తు గన్నీ ట్రేడింగ్ కంపెనీ

## మొలల (మూల వ్యాధి – Piles) 6 రోజులలో బాగైనది

పూజ్యులు, వైద్య మార్తాండ గ్రంథే రఘురామగుప్త మరియు జి.వెంకట ప్రసాద్, B.Sc., R.M.P., గారలకు, ఆర్యా! అనేక వత్సరములుగ మూల వ్యాధితో బాధపడుచున్న నా భార్యకు 6 దినములు మీ ఔషధ సేవ వలన పూర్తిగా బాగుచేశారు.

డి.నెం 30-15-17, దుర్గా అగ్రహారం — కె.వి. కృష్ణా రావ్
మల్లెల శ్రీరామమూర్తి వీధి, విజయవాడ-2. — స్టేట్ రేడియో ఆర్టిస్ట్, 20.1.95

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.3.1995 నుండి 20.4.1995 వరకు)

1. ఈ(మార్చి) నెల 31వ తేదీతో అంతమగు ఆర్థిక సంవత్సరానికి గాను కొత్త అసెసీలు తమ పర్మనెంట్ అకౌంట్ నెంబరు కొఱకు డూప్లికేట్ లో పంపవలసిన ఫారము నెం.49ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ మార్చి నెల 31వ తారీఖు లేదా అంతకులోగా చేర్చాలి–అను అంశాన్ని విస్మరించకండి.

2. మీరు పంపవలసిన A-2 రిటర్న్సును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు ఏప్రిల్ నెల 20వ తేదీయే చివరిది– ఈ విషయాన్ని మరచిపోకండి. మీరు పంపు A-2 రిటర్న్సును చలానాతో బాటు కాకుండా చెక్కుతోబాటు పంపాలనుకున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్న్సును చెక్కుతోబాటు పంపుటను ఏప్రిల్ 15వ తేదీలోగా చేయాలి.

## వైశ్య ప్రబోధిని యాజమాన్యం, తదితర వివరాలు
### ఫారం 4 (8వ నిబంధన చూడండి)

| | |
|---|---|
| 1. ప్రచురణ స్థలం | : వాసవీ ప్రింటర్సు, జయనగర్ కాలనీ, కడప. |
| 2. ఎంత కాలానికి ఒకసారి ప్రచురణ జరిగేది | : నెలకు ఒక సారి |
| 3. ముద్రాపకుని పేరు | : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి |
| జాతీయత | : భారతీయుడు |
| చిరునామా | : 'వాసవీ భవన్', జయనగర్ కాలనీ, కడప – 516002. |
| 4. ప్రచురణ కర్తపేరు | : పై విధంగానే |
| జాతీయత | : " |
| చిరునామా | : " |
| 5. సంపాదకుని పేరు | : పై విధంగానే |
| జాతీయత | : " |
| చిరునామా | : " |

పైన పేర్కొన్న వివరములు అన్నియు యధార్థములు.

కడప. సం॥ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి

14.3.1995 ప్రచురణ కర్త, సంపాదకులు.

శరీరంలో శక్తికి, సంసారంలో అనురక్తికి ! ప్రతిరోజు 2 క్యాప్సూల్స్ పాలతో సేవించండి.

# ఒజోమెన్ క్యాప్సూల్స్






* ఆనందంగా, ఆరోగ్యంగా జీవించటం మీకిష్టమైతే
* మీ శ్రీమతిని మరింతగా ప్రేమించటం మీ కోరికైతే
* తరిగిపోని యవ్వనశక్తి మీకు కావాలంటే
* సుఖమయ దాంపత్యజీవితం మీ ధ్యేయమయితే

**ఇప్పుడు మీకు కావలసినది ఒజోమెన్ క్యాప్సూల్స్**

ఇది ప్రకృతి ప్రసాదిత వనమూలికలు మరియు ఖనిజముల మిశ్రమము. ఎంతకాలమైనను వాడవచ్చును. పథ్యంలేదు. ఎటువంటి దుష్ఫలితాలు ఉండవు.

ఇంకా వివరములు తెలుసుకొనగోరినవారు ఈ క్రింది అడ్రసుకు ఒక పోస్టుకార్డు వ్రాసిన చాలు ఎంతో సమాచారం తెలుస్తుంది.

మార్కెట్ చేయువారు
**స్టెర్లింగ్ రెమిడీస్**
PO బాక్సు నెం : 194,
విజయవాడ - 520 001

తయారు చేయువారు :

**ఫిజికెమ్ లేబరేటరీస్**
పోస్టుబాక్సు నెం
విజయవాడ - 520 001

పేరొందిన అన్ని మందుల షాపులలో లభ్యం

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15951/60 Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavya Printers, CUDDAPAH - 516 002 ☎ : 45035